# శ్రీ గిరీశ శతకము

ఐతా చంద్రయ్య




జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట - 502 103.

# శ్రీ గిరీశ శతకము - ఐతా చంద్రయ్య

జాతీయ సాహిత్య పరిషత్తు - సిద్ధిపేట శాఖ

82 వ ప్రకాశనము

ప్రతులు :1000

సెప్టెంబర్, 1999



రూ॥ 15/-

ప్రతులకు : 1. ఐతా లింగమూర్తి S/o. ఐతా చంద్రయ్య
4-4-11, శేర్‌పురా, సిద్ధిపేట - 502 103.

2. సాహిత్య నికేతన్
బర్కత్‌పురా - హైద్రాబాదు - 27

**శ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారి
షష్టిపూర్తి ఉత్సవ కమిటీ ముద్రణ**

ముద్రణ : **శ్రీ వాసవి ప్రింటర్స్**
మేన్ రోడ్, సిద్ధిపేట - ఫోన్ : 24125

# ఆమోద వీచి

**- ఉమాపతి పద్మనాభశర్మ**

కవిత్వానికొక గురుతరమైన సామాజిక ప్రయోజనాన్ని నిర్వహింప వలసిన బాధ్యత ఉంది. దాని కళాతత్త్వ పార్శ్వాన్ని, అభిరుచి భేదాల్నిబట్టి, అధికారభేదాన్నిబట్టి, సిద్ధాంత భేదాల్నిబట్టి ఎవరెన్ని విధాలుగా విశ్లేషించినా, కవి ఉద్దేశించినా, పనిగట్టుకుని ఉద్దేశింపక పోయినా - ఈ సామాజిక ప్రయోజనం నిస్సంశయంగా కవిత్వానికొక గుణమే అవుతుంది. చెప్పతగిన అంశాన్ని వాచ్యం చేయకుండా చెప్పడం ఒక కళే కావచ్చు. గాఢతా, గూఢతా, రసం, శిల్పం, వక్రోక్తి, గంభీరత లాంటివి కవిత్వానికి ఉత్కృష్ట లక్షణాలే కావచ్చు. కవి ప్రతిభాజన్యమైన శబ్దార్థ సంయోజన పాటవం, ఎప్పడూ తఱిగిపోని అనుస్యూత రసప్రసారం. కవిత్వ ప్రమాణాలకు శాశ్వతత్వాన్ని సమకూర్చి పెట్టవచ్చు. కవి సంస్కార జనితమైన అలౌకిక తత్వదర్శనం కవిత్వాన్ని శిఖరారోహణ చేయింపవచ్చు - కాని ఇవన్నీ ఉపదేశ మూల్యాన్ని పెచ్చించి మాత్రం కాదనుకుంటాను.

దైవభక్తి, దేశప్రేమ, సత్యనిష్ఠ, ధర్మనిరతి, కర్మాసక్తి అనేవి భారతీయ భావనకు పంచప్రాణాలు. వీని ధారణ తోడనే ఈ జాతి తరతరాలుగా అభ్యుదయ నిఃశ్రేయసములను సాధించుకుంటూ వొస్తోంది. కాబట్టి వీనిలో ఏ కొద్దిపాటి క్షతి పొడసూపినా నిబద్ధత గలవాళ్లు సహింపరు. వారివారి తరహాలలో చక్కదిద్దడానికి పరిశ్రమిస్తూ వుంటారు.

భగవానుడు భక్తపరాధీనుడు. వరప్రదాన విషయంలో ఏమోకాని మొరాలకించడంలో మాత్రం ఆయనకున్నంత భక్తపరాధీన మనస్కత, ఔదార్యం మానవమాత్రులెవరికీ ఉండవనిపిస్తూవుంది. పద్యమకుటంలో ఆయనని బంధించేసి ప్రపంచములోని కల్మశాన్నంతా కుప్పలుగా పేర్చి నివేదించినా, వంచనలనీ వక్రతలనీ, కుట్రలనీ కూహకాల్నీ ఆయన ముందు కడిగేస్తున్నా, వైషమ్యాలనూ, వైరుధ్యాలనూ ఏకరువు పెడుతున్నా, వైరాగ్యాన్ని వివరించినా, వైతథ్యాలను విశ్లేషించినా ఆయన తదేకంగా వింటాడు. ఇది చమత్కారమో, వాస్తవమో కాని శతకకర్తలందఱూ ఇంచుమించుగా ఈశ్వరుని ఆభిముఖ్యంతో తమదైన బాణీలో, తమదైన స్థాయిలో సమాజం యెడ తమకుగల బాధ్యతను నెరవేర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

అదే ఒరవడిలో శ్రీ ఐతా చంద్రయ్యగారి ఈ శ్రీగిరీశ శతకం వెలువడింది. ఇది ఆబాలగోపాలానికీ అందుబాటులోనికి రాగల అందమైన శతకం. పదునైన భావాన్ని అతిసరళమైన పద్యంగా మలచడం కష్టం. ఈ కవి చేతిలో తేట తెలుగు ఆటవెలది వ్యావహారిక ప్రయోగాల వయ్యారాలతో, తెలంగాణా పలుకుబళ్ల నిసర్గ భంగిమలతో క్రొంగొత్తగా నర్తించింది. 'శివ శివ యనగానె సిరులు గుప్పిస్తావు -ఆస్తిపాస్తులెన్ని యమరె నీకు ? బిచ్చమెత్తి వరములిచ్చుటే నీ లీల' అని ఆ స్వామి అవ్యాజ కరుణామూర్తినీ, 'సన్నుతాంగ! నిన్ను స్మరియించినంతనే కుంటివాడు గూడ కోటదాటు' అని ఆ ప్రభువు నామ మహిమనూ, 'పాపకూపమందు పారు రాక్షసులకు - వరము లొసగినావు పరమ పురుష ! నాకు జన్మవలదు నాకముజూపింపు' అని ఆ శివుని మోక్షప్రదాన చణత్వమునూ బొమ్మకట్టించిందీ ఆటవెలది. నాకమంటే స్వర్గమని కాక మోక్షమని కవి భావం. 'క' అంటే సుఖం. ('కో బ్రహ్మాత్మానిలర్కేషు సుఖశీర్షజలేషు కమి'తి విశ్వ ప్రకాశః) 'అకం' అంటే దుఃఖం. న అకం అంటే సుఖ దుఃఖ ద్వంద్వాతీతస్థితి. అదే జన్మరాహిత్యం. 'క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి' అని కృష్ణభగవానుడు చెప్పినట్లు స్వర్గాదులు మరుజన్మకు దారిచూపించేవే కాబట్టి వాంఛనీయములు కావు.

అలా జగత్ప్రభువును ప్రార్థించి తన ఝుళిపింపుల విన్యాసాలతో, అధిక్షేపాలతో, వ్యంగ్యోక్తులతో, దేశభక్తులకు కైవారాలతో, అధర్మవృత్తులను ఛీత్కరిస్తూ "పరుల మేలు మఱచి పలువురహింసించి, జపముజేయు మనిషి జన్మకన్న మనిషి మేలు దలచు మహిష జన్మము మిన్న' వంటి మాటల యీటెలతో స్వార్థజీవితాలను పూత్కరిస్తూ, 'పక్షి ప్రాణమైన పంజరమిా కట్టె - భ్రమలు పెంచుకున్న భంగపాటె ! పక్షి యెగిరిపోవు పంజరమ్మునుండి' అని అందరికీ తెలిసినా ఎవరికీ తెలియని నిజాన్ని గొణుక్కుంటూ, 'ఒట్లు కొనగవచ్చు నోట్లు పారేయుచు - పదవి పొందవచ్చు పైసలిచ్చి - మోక్షమెట్లు వచ్చు దీక్ష లేకున్నచో' అని వాళ్లవైపు తిరిగి తర్జనీ కరిస్తూ ఈ నర్తకీమణి బహుముఖాల భంగిమలతో లోకాలోకనం చేస్తూ సాగిపోయింది.

జా.సా.ప. సిద్ధిపేట శాఖ వెలువరిస్తున్న 82వ కావ్య కుసుమమిది. సాహితీ ప్రియులు ఆమోదించి మా సంస్థను ఆశ్వీర్వదిస్తారని విశ్వసిస్తున్నాను.

**ఉమాపతి పద్మనాభ శర్మ**
గౌరవాధ్యక్షులు
**జాతీయ సాహిత్య పరిషత్తు**
సిద్ధిపేట - 502 103.

# ఆత్మీయం

ఆటవెలది ఆసరాగా పరమశివుణ్ణి పద్యపుష్పాలతో పూజించాలని ప్రయత్నించాను. వెన్నుతట్టి ప్రోత్సహించారు కవిమిత్రులు శ్రీ కనపర్తి రామచంద్రాచార్యులు. వారికి నా కృతజ్ఞతలు.

పాఠశాలలో పాఠాలు చెప్పిన గురువులు శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ గారు నా ఎదసొదలో నిండిన పద్యాలను పరిశీలించి మార్గదర్శనం చేశారు. వారికి నా అభివాదములు. మస్తకం పొరల్లోంచి వెలువడిన పద్యాలను అచ్చులో పుస్తకరూపములోకి తేవడమొక యజ్ఞము.

వదాన్యులు శ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారు వారి షష్టిఉత్సవాల సందర్భముగా ఈ 'శ్రీ గిరీశ శతకము'ను అచ్చువేయించి ఆత్మీయత చూపించారు. వారికి ఆయురారోగ్య సంపదలు దండిగా ప్రసాదించాలని శ్రీగిరీశుని వేడుకుంటూ కృతజ్ఞతాభివాదము లర్పిస్తున్నాను.

ఇందుకు కారణభూతులైన మిత్రులు శ్రీ కొమురవెల్లి దుర్గాప్రసాద్ మరియు శ్రీ అయితా బాలరాజేశం (ప్రధానకార్యదర్శి జా.సా.ప.) గారల సహకారము మరువరానిది.

ఇందుకు సమ్మతించిన మా జాతీయ సాహిత్య పరిషత్తుకు ధన్యవాదములు.

తేది : 2-9-1999 **ఐతా చంద్రయ్య**

# కృతజ్ఞతలు

కవి శ్రీ ఐతా చంద్రయ్య గారు మాకు ఆత్మీయులు. రచనా వ్యాసంగములో అనుభవమున్నవారు. మానాన్నా గారైన పూజ్యశ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారి షష్టిపూర్తి సందర్భముగా సాహితీ సమారాధన కోసం అడిగిన వెంటనే "శ్రీ గిరీశ శతకము" రాసి ఇచ్చారు.

శ్రీశైల మల్లికార్జునుడు మాకు ఇలవేలుపు. ఆ శ్రీగిరీశుని ఆశీస్సులతోనే ఈ కార్యక్రమము జరుగుచున్నది. సమకాలీన సమాజములోని సమస్యల నుటంకిస్తూ, భక్తి భావమును రంగరించుకున్న ఆటవెలది పద్యాల శతకమును ఈ శుభ సందర్భముగా అచ్చువేయించడము మా అదృష్టముగా భావిస్తున్నాము. పుణ్యకార్యాలలో ఒకటైన పుస్తక ప్రచురణకు అవకాశం కల్పించిన కథా శిల్పి శ్రీ ఐతా చంద్రయ్య గారికి కృతజ్ఞతలు.

తేది : 2-9-1999

**కొమురవెల్లి దుర్గాప్రసాద్**

**కొమురవెల్లి బుచ్చయ్య**

**కొమురవెల్లి అమర్‌నాథ్**

**కొమురవెల్లి మల్లికార్జున్**

**చింత విజయలక్ష్మి**

# కృతజ్ఞతాభివాదము

(సదాచార సంపన్నులు, వదాన్యులు శ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారి షష్టిపూర్తి ఉత్సవాల సందర్భముగా)

అరమరిక ఒరవడితో
అరవై వసంతాలను సంతరించుకుని
కోటి అనుభవాలతో మేటిగా నిలిచిన
శ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారూ !

సదాచారం బాటలో, మీ
జీవన యానం కొనసాగుతుంది
కాబట్టే -
"సులోచన" వలచి వచ్చింది,
వ్యాపారం కలిసి వచ్చింది.

మూడు ముళ్లబంధం
మూడుపూవులైదు కాయలైంది
దైవకృపా పాత్రులు గనుక -
"దుర్గా ప్రసాదం" లభించింది.
వెనువెంటనే "బుచ్చయ్య" ఉనికి దొరికింది.

"అమర్‌నాథ్" దివ్య దర్శనానందము
"మల్లికార్జును"ని చూపించింది.
నట్టింట "విజయలక్ష్మి" ఉదయించి
విజయ పథము చూపించింది.

పరోపకారశీలి శ్రీ
పండరి నాథుని నెయ్యము
ప్రగతి ఫలాలను పంచియిచ్చింది.

కృష్ణార్జునుల బంధాన్ని
నాటి భారతములో విన్నాము
లింగం - పండరినాథుల అనుబంధాన్ని
నేటి భారతములో కంటున్నాము.

ఒకరు శివుడంటే పొంగిపోతారు
మరొకరు రాముడంటే పొరలిపోతారు
ఏది యేమైనా మీ కలయికను
హరిహరాద్వైతం అలరించింది
శ్రీ సీతారామాంజనేయం శుబాశీస్సులిచ్చింది.

మూలకుల వంశ శిరోమణీ !
మనిద్దరికీ ఇలవేలుపు శివుడే ,
అందుకే నేమో -
మీ షష్టిపూర్తిని సమయస్ఫూర్తిగా
ఆ పార్వతీ మాత కనికరించింది.
నా కవితా సరస్వతికి
మీ అక్షీక్షకటాక్షం చూపించింది.
శ్రీ గిరీశ శతకానికి రూపునిచ్చింది.

స్వాహాకారమే చలామణిలో ఉన్న
ఈ కలియుగములో
మీ సహకారము మరువరానిది.
అందుకోండి -
అభినందనచందనము రంగరించిన
నా కృతజ్ఞతాభివాదము

**ఐతా చంద్రయ్య**



షష్టిపూర్తి మహోత్సవము జరుపుకుంటున్న

శ్రీ కొమురవెల్లి లింగం గుప్త గారు

వారి ధర్మపత్ని శ్రీమతి సులోచన గారు

# శ్రీ గిరీశ శతకము

శ్రీ గణేశ ! నిన్ను చిత్తాన బూజింప
భరతమాత కరుణ వరమునొసగె.
శతక మొకటి గూర్చ సాహసించితి నయ్య
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 1

వెండి కొండ మీద దండిగా కొలువున్న
ఫాలనేత్ర గొనుము ప్రణతు లివిగొ !
కవన వనము నందు కమ్మని ఫలమీయు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 2

చిన్న పదము లెన్న వెన్నవంటివి యంచు
నాటవెలది నాకు బాటజూపె.
తప్పలొప్పలన్ని తమ భార మంటిని
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 3

---

శివ శివ యన గానె సిరులు గుప్పిస్తావు
ఆస్తి పాస్తు లెన్ని అమరె నీకు ?
బిచ్చమెత్తి వరము లిచ్చుటే నీ లీల
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 4

గంగ, గౌరి మధ్య గంతులేస్తుంటావు
భక్తి పిలుపు వినగ శక్తి మీర.
పరుగుతోడ వచ్చి వరము లిస్తుంటావు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 5

అర్థ కామములకు హద్దులు మాయమై
ధర్మమోక్షములకు దారి మాసె.
ఇత్తడి మెరుగిపుడు పుత్తడి మించెను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 6

కట్టు బొట్టు జుట్టు కథలన్ని వెతలాయె
కొత్త ఫేషనొచ్చి కొంప ముంచె.
పుల్లగూరయైన పొరుగింటిదే రుచి
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 7

పావనాంగ నీదు పాదము స్పర్శింప
పాప బుద్ధులన్ని పారి పోవు.
నిప్పదాకి గడ్డి నిలువని రీతిన
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 8

సన్నుతాంగ నిన్ను స్మరియించి నంతనే
కుంటివాడు గూడ కోట దాటు.
ఆటవికుడు గూడ నగును కాళిదాసు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 9

ప్రజల సేవలందు బ్రతికెడు పశువులు
అల్‌కబీరు నందు అంతరించ.
మిన్నకున్న నేటి మేధావు లెందుకు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 10

కష్ట సుఖములేవి కలకాల ముండవు
పగలు రాత్రి వోలె పరుగులెత్తు.
పాపపుణ్యమెంచు పౌరులే ధన్యులు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 11

కోతి నుండి మనిషి జాతి పుట్టిందని
డార్విసుండు జెప్పె ఢంక గొట్టి.
నేటి కోతి జాతి నాటి మనిషిదౌనొ ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 12

పాప కూప మందు పారు రాక్షసులకు
వరము లొసగినావు పరమ పురుష !
నాకు జన్మ వద్దు నాకము జూపించు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 13

సెగల కన్ను దెరిచి శిక్షలు వేసావు
కామ విభుని గూడ గాల్చినావు.
బంకులాట గాళ్ల బొంకు లేమందువు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 14

పదవి పెదవి కొరకు పరుగు పోటీలాయె
స్వార్థ రాజకీయ స్వాములందు.
పదవిలేని వాడు పనిలేని మంగలి !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 15

జన్మనిచ్చినట్టి జననీ జనకులన్న
భయము తరిగిపోయె భక్తి కరిగె.
భావి తరాలలో బాంధవ్యమెట్లుండు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 16

వేప పండు దినగ వెగటు గల్గిన గాని
దుష్ట రోగములను దూరముంచు.
చేదు నిజము ముందు చేదును సుఖములు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 17

అమ్మయన్న పదము అమృతము నొలికింప
మనము బిలువ నేల "మమ్మి" యనుచు ?
మాతృ భాషలోనె మాధుర్య ముందయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 18

అన్నముంటె చాలు అణ్వస్త్రమొద్దని
రెచ్చగొట్టు వారి ఇచ్ఛయేమి ?
కట్టు లేనివాడు వెట్టివాడే నేడు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 19

ఇంటదినుచు బెరిగి ఒంటి సుఖానికై
బయట పేరుదలచు బ్రతుకుటేల ?
కన్నతేల మఱచు కలినాత్ము నేమందు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 20

పైసలోడి మాటి పారును జగమెల్ల
పైస లేనివాడు పస్తులుండు.
కాసులున్న వాడె కైలాసపతియట
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 21

తోడబుట్టి నాడు కూడ బెరిగిన వారు
తగవు లాడిరయ్య ధనము కొఱకు.
ధనము మహిమ దెలుప దగదు నెవ్వారికి
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 22

అప్పు దెచ్చు నాడు ఆనందమే గాని
తీర్చునాడు గలదు తిప్పలంత.
అప్పుదేని వాడు అవని నేలు రాజు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 23

సమర జీవులంత అమరులై పోవగా
సొంత డబ్బ గాళ్ల సంత మిగిలె !
బుద్ధిమంతులాత్మ శుద్ధి పొందాలయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 24

మాతృభూమి కొఱకు మరణించు వీరుల
సంస్మరించు జాతి చక్కబడును.
గతము మఱచు జాతి గతి దుర్భరమ్మయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 25

కట్న కానుకలనుచు కన్యల వేధించు
మనసు చూడలేని మనుషులున్న.
చట్టమేమి జేయు చుట్టమై పోవును
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 26

అన్నము గతిలేక ఆకలి భోంచేసి
కనులనీరు దాగు జనము ముందు,
రాజకీయ మాడు వాజమ్మ లెందుకో ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 27

ప్రజల ధనము తోడ పై చదువుకు బాకి
మారుదేశ సుఖము మఱిగి 'బుధులు'
తల్లిపాలు దాగి తగ ఱొమ్ము గ్రుద్దిరి
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 28

పిల్ల నిచ్చినోడు పిల్లి పిల్లయిపోయె
పుచ్చుకున్నవాడు పులిగ మారె.
ఆడపిల్ల తండ్రి గోడు లింకెన్నాళ్లు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 29

నేటి బిచ్చగాడు నాటి కోటీశుడు.
నాటి బీదవాడు మేటి ధనియు
నిలువ లేని సిరికి నీరాజనము లేల ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 30

ప్రాత కైతలందు ప్రాణమే లేదని
గొంతు చించుకున్న గొప్పగాదు.
మనసుదాకు కవిత మహి నిల్చియుండును
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 31

కూడు గుడ్డ లేక కుమిలెడి జనులుండ
ప్రగతి ఫలితమెటుకు పారిపోయె !
మేడి పండు రీతి మిగిలె స్వరాజ్యము
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 32

పరులపేరు మఱచి పలువుర హింసించి
జపము జేయు మనిషి జన్మకన్న,
మనిషి మేలు దలుచు మహిష జన్మము మిన్న
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 33

ప్లాను లెన్నొ వేసి ప్రాజెక్టులను గట్టి
కోట్ల కోట్లు ఖర్చు కొంప ముంచె.
త్రాగునీరు లేక తంటాలె మిగిలెరా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 34

కన్ను, కాలు, డబ్బు, పన్ను యేదో జబ్బు
మనిషి తోడ జగడ మాడుచుండు.
జబ్బులేని వాడు జగమంతా లేడయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 35

అతివ అర్ధరాత్రి అంగడి దిరిగిన
అసలు స్వేచ్ఛనాడు అమరుననిరి
పట్టపగలు పురుషు బట్టుకెళ్లిరి నేడు !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 36

చలన చిత్రసీమ చపల చిత్తము నిచ్చె
ముద్దు, ఘుద్దులందు మోజుబెంచె.
కళలు దారి దప్పి కాసుల పరమాయె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 37

విప్లవోద్యమాలు వింత పుంతలు ద్రొక్కి
నేల విడచి సాము జేయు చుండ
దేశమాత మోము దీనమై పోయెను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 38

పెద్ద బెరగ గానె బుద్ధి బూడిదపాలు
అన్నదమ్ములందు ఆస్తి పోరు.
చిన్న నాటి ప్రేమ చిగురంత గనరాదు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 39

తిండి లేనినాడు తిండి ఆరాటము
తిన్న నాడు పొదుపు మిన్న యగును.
ధనము కూడగానె దరిజేరు రోగాలు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 40

కులము పేరు జెప్ప కుత్సిత మన్నారు
కులము తోడ ధొరికె కొలువు, పదవి.
మాసిపోయె చెలిమి మాటకు చేతకు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 41

వచన కవిత లందు వాసియేముందని
పరిహసించి రయ్య పద్య కవులు.
అసమదృష్టి కవుల కందమా చందమా !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 42

పాత చింతకాయ పద్యమే వద్దని
మిడిసి పడిరి కొత్త పడుచు కవులు.
కొత్త వింతయైన పాత రోతగునెట్లు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 43

సమర రంగమాయె సాహితీ క్షేత్రము
దళిత, మహిళ వేరు దారులాయె.
మనసు మలినమైన మనుషుల గతియేమి ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 44

కవితలెన్నొ రాసి కావ్యాలు వేసినా
కొన్ని వెలుగు గాని అన్ని గాదు.
పెక్కు విత్తనాలు దక్కునా మొక్కలై !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 45

ఓటు బలము వల్ల సీటు సంపాదించి
పీఠమెక్కగానె పేరురాదు.
నేతలందు స్ఫూర్తి దాతలు కొందరే
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 46

శ్రమకు దగిన ఫలము భ్రమల పాలైపోయె
కార్మికులకు లేమి, కలలు మిగిలె.
ఘర్మ జలము విలువ ఘనులకే తెలియదు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 47

చిటికెడంత పసుపు చేతులలో రాసి
అతివ మోము దిద్ద అందమొదవె.
పొడమంత బొట్టు చూడ ముచ్చటగొల్పు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 48

పల్లె పట్టులన్ని పట్టణాలైపోగ
ప్రకృతి పొగల సెగల పరిఢవిల్లె.
కాలకర్మ మేమొ కలుషితమ్మై పోయె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 49

శాసనాలు జేసి బాసలు చేసినా
బిచ్చగాళ్ల సంఖ్య బెదర గొట్టె.
చిత్త శుద్ధి లేని చేష్టలింతేనయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 50

పుట్టబోవు చిట్టి పోరగానికి పాఠ
శాల సీటు కొరకు వేలమాయె.
పిల్ల బుట్టకుండ కుల్ల గుట్టించేరు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 51

పుస్తకాల బరువు మస్తక మందక
చిట్టిపొట్టి వీపు చిట్లి పోయె.
చిట్టెడు చదువుకు పుట్టెడు ఖర్చులు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 52

మాటలందు తేనె మూటలు చూపించు
చేతలందు పాత చెత్త మిగులు.
ఊకదంపు లందు ఊరునా బియ్యము !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 53

శివుడె గొప్ప యనుచు శివమెత్త ఉన్మాది
హరియె గొప్ప యనుచు అరుచునొకడు.
ఆలకించ రేల హరి హరా ద్వైతము !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 54

తేనె కుండలోన తెమలని ఈగలా
దైవ నామ మెపుడు దలువరయ్య.
కష్టకాల మందె కలువరింతురు నిన్ను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 55

పరుల మేలు కోరుకు పరితపించువాడు
మనిషి రూపమందు మాధవుండు.
ప్రాణి కోటి సేవ పరమాత్మ సేవయే
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 56

ధూమపాన మనగ దూబరా గాబరా
తెలిసి గూడ దాని చెలిమి యేల ?
చావు తెలివి గూడ చవక బేరమ్మాయె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 57

గుట్కా, పాను, జర్ద, మట్కా, పేకాటలు
మత్తు సాగరమున చిత్తు జేయు.
చెదలు మొదలు జేరి చెట్టు గూల్చునుగదా !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 58

మతము పేరు జెప్ప నేత కోతలు నమ్మి
ఓట్లు వేసినంత పాట్లు బెరిగె.
ముందు చూపులేక ముప్పు వాటిల్లును
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 59

కాయితముల ధరలు గగనమ్ము జేరగా
ముద్రణ ధర లేమొ ముదిరిపోయె.
రచన వెలుగు జూడ రాజసూయమ్మాయె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 60

తనువు, మనసు, ధనము తగురీతి వెచ్చించి
రచన లచ్చువేయు రంగు దెలిసి.
పొత్తము కొని చూచు పుణ్యాత్ములెందరు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 61

టీ.వి. వీడియోలు టీవిగా సినిమాలు
కొల్లలాయె మనసు గుల్లజేయ.
పుస్తకాలు జదువు పుణ్యకాలమ్మేది ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 62

ఆస్తులున్న నాడు అందరు చుట్టాలు
లేని నాడు యెవడు కానరాడు.
వాన కాల మందు వదరు కప్పలౌర !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 63

మనసు చంచలమ్ము మనదొక్కరీతిగా
ఆకొతాయివోలె ఆటలాడు
నిలకడ కలిగించు నీ నామమొక్కటే
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 64

పక్షి ప్రాణమైన పంజరమీ కట్టె
భ్రమలు పెంచుకున్న భంగపాటె !
పక్షి యెగిరి పోవు పంజరమ్మునుండి
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 65

బంధముక్తమైన భక్తి యానందము
భక్తి యున్న ఆత్మ శక్తిమయము
ముక్తి సాధమునకు భక్తియే మార్గము
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 66

దండమొకటి బెట్టి దరఖాస్తు వేయగా
పనులు గావునేడు పచ్చినిజము.
పైరవీల పనులు ఫలితాల నందించె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 67

జగము నాటకమ్ము జనులంత పాత్రలు
వచ్చిపోవు చుంద్రు వరుస బట్టి.
సూత్రధారి వీవు చూడు తమాషాను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 68

సంతులేని వారి సన్నుతి గైకొని
పాపనివ్వవేమి పాపనాశ !
వద్దు వద్దటన్న వడ్డించుటే లీల
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 69

చంద్రమౌళి, ఈశ ! చైతన్య రూపమా !
చీకటి గుహలోన చెలగు చుంటి.
కాంతిరేఖ వోలె కదలి రావేమయ్య
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 70

ధైర్యమేమి లేక దైన్యముగా నోడి
దైవ లీలయన్న భావమేమి ?
పిటికివాని బతుకు పృథ్వికే బరువౌను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 71

విశ్వమందు నాటి విప్లవోద్యమనేత
భారతాంబ నుదుటి భవ్యరేఖ.
సమరశక్తి దాత సావర్కరును దల్తు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 72

తెల్లదొరల శక్తి కొల్లగొట్టుచు దేశ
మాత స్వేచ్ఛ సమర జోతయైన
మదనులాలు డీంగ్ర మహనీయు దలిచెద
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 73

కన్ననేల కొరకు కామ మేడం నాడు
ఫ్రెంచినేల నిలిచి పోరుసలిపె.
ప్రాణమిచ్చిన తల్లి పాదాల బూజింతు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 74

స్వాభిమాన శక్తి సమర వీరాంగన
మొదట యుద్ధ మందు మురిసినట్టి,
లక్ష్మిబాయి కివియె లంఛనమస్సులు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 75

దాస్య జీవనమ్ము దావానలము గాగ
జబ్బ జరిచి నిలిచె జట్టి యొకడు.
ప్రణతు లిడుదునయ్య బల్వంత ఫడ్కేకు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 76

ఓట్లు కొనగ వచ్చు నోట్లు బారేయుచు
పదవి బొంద వచ్చు పైసలిచ్చి.
మోక్ష మొటుల వచ్చు దీక్ష లేకున్నచో
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 77

వధువు నల్లనైన వలదు మాకందురు
కట్న మెక్కువైన కలదు దారి.
మనసు దెలియలేని మనుషుల లీలలు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 78

ఆట పాట లందు అందె వేసిన జాతి
విశ్వక్రీడ లందు వీగిపోయె.
ఆత్మ శుద్ధి లేని అభిమానమేలనో !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 79

చిత్తశుద్ధి లేక సినిమాలు జూచుచున్
మంచి వదలి చెడును పంచుకొనగ,
"అర్థ"మంత కరిగి వ్యర్థమై పోవును
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 80

నీరు లేని పాలు దొరకనే దొరకవు.
కల్తి లేని సరుకు కానరాదు.
కలియుగ మన గొప్ప కల్తీ యుగమ్మాయె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 81

అప్పులిచ్చి నోడు అగనే అగడు,
తీసుకెళ్లి నోడు తిరిగిరాడు.
అప్పు కొప్పు కథల కంతమే లేదయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 82

నాది నాది యన్న నరుడంత మందున
ఏది వెంట గొనక నెగిరి పోవు.
మేను నాది గాదు నేను నీ వాడను
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 83

ఆశతోడ మనిషి ఆకాశమెగిరేను
ఆశలేని వాడు అవని లేడు.
ఆశ హద్దు మీరు ఆశయమంతమౌ
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 84

పదవి దక్కగానే పక్కచూపైనచో
పదవి దారిదీయు పతనమునకు.
నహుష చక్రవర్తి నగుబాటు గాలేదె !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 85

కాయ కష్ట మన్న కంపము బుట్టును,
రాత పూత లన్న రోత బుట్టు.
తిరిపెము టలవాటు తీరులింతేనయా
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 86

ఉన్న రోజు లందు వెన్ను వీడనివాడు
లేని కాల మందు కానరాడు.
పత్రిక చదివేసి పారవేసిన రీతి
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 87

పానిపట్టు యుద్ధ పవనాలు భారత
చట్ట సభల లోకి కొట్టుకొచ్చె.
కంచె చేను మేయ కాపు గాసేదెవరు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 88

పనికి రాని కథలు పత్రిక లచ్చొత్త
యువత మనసు చెదిరి భవిత మాసె.
హితవు జెప్ప కథలు మితమైన చాలును
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 89

అంద చందములను అమ్మిన నెరజాణ
కుక్కి మంచ మందె నిక్కి నీల్గు.
ముందు చూపు లేని మూర్ఖుల గతియిదే !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 90

హరిని గొలిచె హరుడు హరుని గొల్చె హరియు
వారి లోని ఏమి వాదు లేదు.
శివుడు, విష్ణు వనుచు సిగపట్లు మనకేల ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 91

ఒకని నెక్కువనుచు నొకని తక్కువనుచు
కన్న కడుపు తీపి కల్తియైన.
తల్లి యసమ దృష్టి తనయుల శాపమే !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 92

సురలు నసురు లెపుడు మఱువని దేవుని
నరుల మఱువు మనగ న్యాయమౌనె ?
కలల అలల నమ్మి కయ్యాలో బడనేల !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 93

రామ కృష్ణ కథల రంగులు దెలియక
నేత యైన వాడు నిలువ లేడు.
ధర్మ మర్మమెంతొ దాగుంది వాటిలో
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 94

దైవపూజ నెపుడు దలవని భీరులు
చేవ యుడిగినపుడు జేతుమనిరి.
చేష్టలుడుగు వరకు చేరదా మృత్యువు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 95

మూల్గె పాకు నేల మూడు యుద్ధాలందు
కన్నులొట్ట బోయె కార్గిలందు,
పులితొ వైరమున్న పిల్లి జీవించునా ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 96

నాడు ఢిల్లి దాక నడిచి వచ్చెదనంటు
భుట్టొ మొరిగి నేల మట్టమాయె.
భారతాంబయన్న భద్రకాళియె గదా !
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 97

కదన రంగమందు కలికావతారమై
పాకు మూక దునిమి ప్రాణమిచ్చె.
పద్మపాణి కవియె పదివేల దండాలు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 98

మూడు ముళ్లు వేసి ముచ్చట లొదిలేసి
ఆలి మరిచి కారిగిల్లు కేగి.
శ్రీనివాసరెడ్డి శ్రీ నివాసము జెరె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 99

అపర రుద్రుడాయె అలివీర శరవణన్
పాకు తలల తోడ బంతులాడె.
విజయలక్ష్మి నిచ్చి వీరస్వర్గము జేరె
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 100

సొంత భాష తీపి సుంతయు నొల్లక
పరుల భాష వెంట పరుగు లిడిన.
ఆలినొదిలి వెలయాలి బట్టినయట్లు
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 101

మట్టిలోన బుట్టి మట్టిలోనే గిట్టు
మనిషి బ్రతుకు నెపుడు మట్టితోడ.
మట్టిలేని మనిషి మనుగడ శూన్యమే
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 102

ధనము గల్గునపుడె దారాసుతుల ప్రేమ
ధనము లేనినాడు దయ్యమంద్రు.
పైస లోన ఇంత పస యెందుకుంచావు ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 103

దానగుణము లేని మానవ మాత్రులు
పూలపూజ జేయ పుణ్యమేమి ?
నేల విడిచి సాము నెంత జేసిన నేమి ?
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 104

నేను పూవునయ్య నీచెంత వాలెద
కరుణ జూపవయ్య పరమ పురుష !
కలియుగ మని నన్ను వెలివేయబోకయ్య
సిద్ధిపురి నివాస శ్రీగిరీశ ! 105

